**ఆషాఢం :-** మానసికంగా ఉల్లాసంగా ఉంటారు. కాని ఆదాయం ఉండదు. కుటుంబఖర్చులు విపరీతంగా ఉండును. ఋణాలు చేయవలసి వచ్చును. దూర ప్రయాణాలులాభించును. చేయువృత్తివ్యాపారాలుబాగున్ననూ ఆర్థికవ్యవహారాలు సంతృప్తినివ్వవు. ముఖ్య వ్యవహారములు నిలచిపోవును. జాయింటు వ్యాపారస్థులు విడిపోవుదురు. 12వఇంట కుజునివల్లఅలసట,అకాలభోజనాలు,ఆరోగ్యభంగాలు.

**శ్రావణం :-** అనేకఈతిబాధలు,ఆరోగ్యరీతాకూడాఇబ్బందులుతప్పవు. శస్త్ర భయం, ఆందోళనకలిగించు సంఘటనలు, ప్రతీనిముషం కష్టం గానే ఉంటుంది. ఆర్థికంగా బాగానష్టపోవుదురు. ఋణాలు చేయవలసి వచ్చును. సరైన సమయానికి ధనం చేతికందక అమర్యాదపాలగుదురు. చేయనిదానికి నిందలు పాలగుదురు. నమ్మినవారి వల్ల మోసపోవుట,శిరోబాధలు వేధించును. వాహన ప్రమాదాలు.

**భాద్రపదం :-** ఈనెలలో మిశ్రమ ఫలదాయకంగా ఉండును. ప్రథమార్థంలో ఆర్థిక పరిస్థితులు కొంత అనుకూలమే. వృత్తివ్యాపారాదులు రాణించును. గతంలో అందవలసిన ధనం చేతికందును. పనులుపూర్తి చేయగలరు. ఆరోగ్యంకొంత పర్వాలేదు. పరామర్శలుచేయుదురు. పితృలేదామాతృవర్గసూతకాలుతొలగును. మనఃశ్శాంతిఉండదు. ఉద్యోగులకుగృహచలనం. కొన్నివిషయాలందు బాధలుతప్పవు.

**ఆశ్వీయుజం :-** ఈనెలలో అనుకూల గ్రహసంచారం లేని కారణంగా అనేక ఇబ్బందులుతప్పవు. మానసికంగా కృంగిపోవుదురు. ప్రతిచిన్న విషయానికి ఆందోళన, ధనం మంచినీళ్లవలెఖర్చగును. బంధుమిత్ర విరోధాలు, భార్యాభర్తల మధ్య సరైనఅవగాహనుండక విరోధాలేర్పడును. వాహన ప్రమాదం, నేత్రపీడలుకల్గును.

**కార్తీకం :-** జన్మరాశిలో రవి, శుక్రులు సంచారం వలన ఉద్రేకం పెరుగును. ప్రతీ చిన్న విషయానికి గొడవలు ఏమి మాట్లాడిన విరోధమే వచ్చును ఇంతకు ముందు మెచ్చుకొనినవారుకూడా వ్యతిరేకింతురు. అధికంగాచాలానష్టపోవుదురు. పోలీసుకేసులందుఇరుక్కొనుట. శారీరకగాయాలు. రక్తంకళ్ళచూచుటజరుగును.

**మార్గశిరం :-** ఈనెలలో కొంతమేర పర్వాలేదు. చేయువృత్తి వ్యాపారములు లాభించును. శారీరక శ్రమ అధికం. అకాలభోజనం, పనులందు అసంతృప్తి. కాని ఆర్థికంగా కొంత ఉత్సాహంగా ఉంటుంది. ప్రయాణములందు సౌఖ్యం, స్త్రీ సుఖం, దూరప్రయాణములాభములు. గృహంలో శుభకార్యాలు. సంతానవృద్ధి.

**పుష్యం :-** అనుకూల గ్రహసంచారంవలన అన్నిరంగములవారికి చేయు వృత్తి వ్యాపారాలందు అనుకూలత. ఆర్థిక లావాదేవీలు సంతృప్తి, అనుకోని సమస్యలు పటాపంచలై పోవును. ఎంతటివారితోనైనా మాట్లాడగల ధైర్యం వచ్చును. వాహన సౌఖ్యం, నూతన పరిచయాలు కలిసివచ్చును. నూతన వస్తు, వస్త్ర లాభములు.

**మాఘం :-** అన్నింటావిజయం,మీమాటకు ఎదురులేకుండా ఉంటుంది. ఆరోగ్య లాభం,ఆదాయంనకు లోటుండదు. బంధుమిత్ర సమాగమం, వాహనసౌఖ్యం, ధైర్యంతోకూడినపనులుచేస్తారు. సమస్యలుమబ్బువీడినట్లువిడిపోవును. సంతాన సౌఖ్యం, నూతన పరిచయాలు, కుటుంబ సఖ్యత, వ్యాపారంలో మంచి లాభాలు.

**ఫాల్గుణం :-** ఈనెలలోనూ గ్రహసంచారం అనుకూలించుటచే అన్నివర్గముల వారికి అనుకూలమే. చేయువృత్తి వ్యాపారములు అనుకూలించి ధన లాభములు కలుగును. కోర్టు వ్యవహారాలు మీకు అనుకూల తీర్పులు వచ్చును. దూరప్రయాణాలు, వివాహాది శుభకార్యములు జరుగును. ప్రయాణములు కలిసి వచ్చును. విద్యార్థులుపరీక్షలుబాగావ్రాయుదురు. ఉద్యోగులకుస్థానచలనంలేదాగృహచలనం



# తులారాశి ఫలితములు

**చిత్త 3,4 పాదములు స్వాతి 1,2,3,4 పాదములు విశాఖ 1,2,3, పాదములు**

**ఆదాయం - 11 వ్యయం - 5** | **రాజపూజ్యం - 2 అవమానం - 2**

**ఈ రాశి వార్కి శని 6,5లలో రజిత, లోహమూర్తి, గురుడు 9వ ఇంట లోహమూర్తి, రాహు, కేతువులు, 5,11లలో తామ్ర మూర్తులు.**

ఈ రాశి స్త్రీ పురుషాదులకు దైవబలం హెచ్చుగా ఉండును. ఆత్మవిశ్వాసంతో ముందుకుపోగలరు. ధనం,సంపత్తు, కుటుంబం, పుత్రులకు కారకుడైన గురువు 9స్థానములలో ఉండుట, యోగకారకుడైన శని 6వ స్థానంలో ఉండుట, విశేష మైన యోగఫలం. శత్రువులు అంతరించుట వ్యవహారములలో జయం. గతంలో సాధించలేని పనులు ఈకాలంలో రెండింతలు ఫలించును. ఏ వృత్తి వ్యాపారంలో ఉన్నవారికైనా సంవత్సర ప్రారంభం నుండి 2లేదా 3 మాసములు ఒడిదుడుకులు, ధననష్టం, గృహసంబంధ రీత్యా విపరీత ధనవ్యయం, రావలసిన సొమ్ముకు ఆటంకములు, అపనిందలు వంటివి కలిగినా అవి జూన్ నుండి అంతరించి ఉభయక్షేమం కలుగును. సాంఘికాభివృద్ధి, మనోవాంఛలు నెరవేరును. స్వశక్తి సామర్థ్యముచే పైకి రాగలుగుతారు. శత్రుత్వములు వచ్చినా అణచివేస్తారు. నూతన ఆలోచనలు, పోకడలచే సంఘంలో గౌరవాదులు సిద్ధించును. పుణ్యక్షేత్ర సందర్శనం, గృహంలోశుభకార్యాలు కలిసివచ్చుట. స్త్రీ పురుషాదులకు వివాహాది శుభకార్యములు కలిసివచ్చుట. దాంపత్యానుకూలత, గృహజీవితానందం కల్గును. కోర్టు వ్యవహారములందు, అప్పీలలో జయం. మీ ఎదుట నిలిచిమాట్లాడలేరు. అన్నిరంగములవారు శ్రమకు తగ్గ విశేషఫలితం పొందుదురు. మీ అభివృద్ధి, నడవడికను చూచి సహించలేని వ్యక్తులు వల్లఅనుకోని బాధలు వచ్చినా వాటిని తట్టుకొనిముందుకుపోగలరు. నూతనవాహనలాభం, భూ,గృహంవంటి స్థిరాస్తులు లభించును. ఫైనాన్సువల్లలాభాలు విశేషభోగభాగ్యాదులుఅనుభవించుటజరుగును.

మొత్తంమీద ఈ రాశివారందరికీ గురుబలం వల్ల చక్కని జీవితమును పొందగలరు. గత కొద్దికాలముగా పడుచున్న బాధలు తొలగును. కాని రాహువు వల్ల కొంతమేర ఇబ్బంది కలిగిననూ ఎదుర్కొనగలరు.

**చైత్రం :-** ఈనెలలో మిశ్రమఫలదాయకం చేయువృత్తివ్యాపారములందు రాణింపు ఉన్ననూ, ధనం మంచినీళ్ళవలె ఖర్చగును. ఒక్కోసారి ఋణాలు చేయవలసి వచ్చును. అయిన అధైర్యపడరు. వ్యవహారాదులు అనుకూలించును. ఆరోగ్యం బాగుంటుంది. ఊహించని సంఘటనలు జరిగిననూ మనోనిబ్బరం చెక్కుచెదరదు. ధైర్యంతో ముందుకు పోగలరు. వివాహాది శుభకార్యములకు హాజరగుదురు.

**వైశాఖం :-** ఈనెలలో గ్రహసంచారం అంత అనుకూలించదు. చేయువృత్తి వ్యాపారాలందు ఆటంకములు, శారీరకశ్రమ, అశాంతియు, బంధుమిత్రాదులతో కలహములు, ఏమిమాట్లాడిన వ్యతిరేకత, ఆరోగ్య భంగాలు, వాహన ప్రమాదాలు, సంతానంతో ఇబ్బందులు, భార్యా భర్తల మధ్య సరైన అవగాహన ఉండదు. సంఘంలో అపనిందలు. ఉద్యోగులకు స్థానచలనాలు, గృహచలనములు తప్పవు.

**జ్యేష్ఠం :-** చేయువృత్తి వ్యాపారులకు అన్నిరంగములవారికి బాగుంటుంది. ఆర్థిక సమస్యలు అంతగా బాధించవు. ఆరోగ్యం కుదుటపడును. స్నేహితుల సహాయ సహకారం వలన పనులు పూర్తి చేస్తారు. శుభకార్యాలు కలిసివచ్చును. సంతానం వలన సౌఖ్యం, స్త్రీ సౌఖ్యం, యశోభూషణప్రాప్తి, అందరిలోనూ మీదే పైచేయి.

**ఆషాఢం :-** అన్నివిధాలుగా అందరికీబాగుంటుంది. చేయు వృత్తివ్యాపారాలందు రాణింపు ఆదాయంబాగుండును. ఆరోగ్యలాభములు. దూరప్రయాణములు కలసి వచ్చును. పుణ్యనదీస్నానములు, మిత్రులతోకలసి విందులువినోదాలు, సంఘంలో మంచి గుర్తింపు. ఇతరులకు పనులలో సహాయ సహకారములు అందించెదరు.

**శ్రావణం :-** గ్రహాలన్నీ అనుకూలసంచారంవల్ల అన్నివిధాలుగా బాగుంటుంది. పనులు త్వరితంగా పూర్తి. కోర్టువ్యవహారములలో మీదేవిజయం. మనస్సు ప్రశాంతంగా ఉండును. ప్రతివిషయంలో మీఆధిక్యత కనిపించును. రానిబాకీలు వసూలగును. శతృవులే మిత్రులగుదురు. కుటుంబసౌఖ్యం, వాహనమార్పులు తప్పవు.

**భాద్రపదం :-** ఈనెలలో మిశ్రమ ఫలితాలు. ఆదాయంనకు మించినఖర్చులు. ఊహించని సమస్యలు ఎదురగును. ప్రతిచిన్న విషయానికి చికాకు పడుదురు. ఉద్రేకం హెచ్చును. ఆరోగ్యభంగాలు, కుటుంబచిక్కులు, విరోధాలు, కార్యాటంకములు, మానసికంగా కృంగిపోవుదురు. ప్రయాణములో ప్రమాదాలు, ధననష్టం.

**ఆశ్వీయుజం :-** ఈనెలలోకూడా అంతఅనుకూలతఉండదు. పనులందు ప్రతిబంధకాలు. శారీరకశ్రమ, అలసట, త్రిప్పుట, అకాలభోజనాలు, శతృబాధలు, సమస్యలలోచిక్కుకొనుట, విలువైనవస్తువులుపోగొట్టుకుంటారు. కుటుంబంలోనలతలు, సంతానంద్వారా ఇబ్బందులు, దొంగల భయం, ప్రభుత్వసంబంధ ఇబ్బందులు.

**కార్తీకం :-** ధనం మంచినీళ్ళవలె ఖర్చగును. ఋణములు చేయవలసి వచ్చును. పరిస్థితులు అనుకూలించవు. ప్రతీవ్యవహారంలోనునష్టములే. చిన్నవారివలన అవమానాలు, ప్రభుత్వపరంగా చిక్కులు. మిత్రులు వల్ల మోసపోవుట, సకాలంలో ధనంచేతికందదు. వాహనప్రమాదాలు. బంధుమిత్రవైషమ్యాలు, శిరోపీడలు తప్పవు.

**మార్గశిరం :-** ఆరోగ్యం బాగుండదు. ధననష్టములు. శారీరక గాయములు, చాలా ఉద్రేకముగా చికాకులతో ఉంటారు. ఇతరులు ఎంతశాంతంగా మాట్లాడినా మీరు అధిక కోపంతో మాట్లాడుదురు. శస్త్రభయం, ఆందోళన కలిగించు సంఘటనలు జరుగును. సోదరవర్గం వారితో కలహాలు తారాస్థాయికి చేరును.

**పుష్యం :-** ఈనెలలో పరిస్థితులు కొంతమేర అనుకూలించును. కోపంమాత్రం తగ్గదు. చేయువృత్తివ్యాపారాలు రాణించును. వ్యవహారములు అనుకూలించును. ఆర్థికంగా బాగుంటుంది. దూరప్రయాణములు, బంధుమిత్రులతో కలయిక, నూతనవస్తు, వస్త్రప్రాప్తి, గృహంలో సంతోషం, పాతమిత్రులనుకలుసుకుంటారు.

**మాఘం :-** అన్నివిధాలుగా బాగుంటుంది. సంతోషంగా, ఆనందంగా, గృహంలో శుభకార్యములు, గృహనిర్మాణములు కలిసివచ్చును, స్థిరాస్థిలాభం, స్పెక్యులేషన్ అనుకూలత, లోగడ నిలచిన పనులుపూర్తి, ఉద్యోగులకు ఆనందమైనవార్తలు వింటారు. సంఘంలో ఉన్నతస్థితి, మధ్య వర్తిత్వం లాభించును. సంతానసౌఖ్యం.

**ఫాల్గుణం :-** చేయువృత్తి, వ్యాపారాలుబాగాఅనుకూలించును. ఆరోగ్యం బాగుంటుంది. మిత్రుల సహాయసహకారములభించును. వాహన సౌఖ్యం, నూతన వాహనప్రాప్తి. క్రొత్త వస్తువులు కొంటారు. భార్యతో సఖ్యత, ఆనందమైన జీవనం సంతానంద్వారా లాభములు, నూతన పరిచ యాలు ఫలించును. సంఘంలో మీపేరు ప్రఖ్యాతులుబాగా పెరుగును. విద్యార్థులు పరీక్షలు బాగా వ్రాయుదురు.



# వృశ్చికరాశి ఫలితములు

**విశాఖ 4వ పాదము అనూరాధ 1,2,3,4, పాదములు జ్యేష్ట 1,2,3,4 పాదములు**

**ఆదాయం - 2 వ్యయం - 14** | **రాజపూజ్యం - 5 అవమానం - 2**

**ఈ రాశి వార్కి శని 5, 4లలో సువర్ణ, తామ్ర మూర్తులు, గురుడు 8వ ఇంట సువర్ణమూర్తి, రాహువు, కేతువులు, 4,10లలో రజితమూర్తులు.**

ఈరాశి స్త్రీ, పురుషులకు ధనకారకుడైన గురువు 7,8 స్థానములందు, వాహనాధిపతి, భూ, గృహ స్థానాధిపతి శని స్వక్షేత్ర స్థితి, రాహు, కేతు స్థితులు బాగున్నందువలన యోగ్యమైన అన్నపానీయాలు, వాహనలాభం, విద్యాధీఖ్యాత, లోగడ రెండుసం॥లు నుండి నిలబాటుగా ఉన్నపనులు పూర్తగుట,స్వశక్తి సామర్థ్యములచే పైకి రాగలుగుట, వ్యవహారజయం, జీవనలాభం మీలో గల చతురత్వంచే ఎంతటివారినైనా స్వాధీనం చేసుకొనుట, మాటలు నైపుణ్యము కలుగును. అధికార వర్గం మీకు అన్నివిధములుగా చేదోడువాదోడుగా ఉండును. దూరప్రయాణములు లాభించును. ఏవిధమైనసంకోచం చెందక నిర్భయంగా సంచరించి ముందుకు పోగలరు. స్వగృహనిర్మాణము సిరాస్థివృద్ధి, కోర్టులావాదేవీలు విజయవంతము. కుటుంబసభ్యులువలన మీ గాంభీర్యత పెరుగును. చెడు ప్రభావం మీపై అంతగా ఉండదు. కుటుంబకలతలు. భార్యా బిడ్డలు మధ్య స్వల్ప ఈతిబాధలు వచ్చినా గృహములో శుభకార్యములు చేస్తారు. అప్రయత్న ధనలాభము, సంతానం యొక్క ప్రాముఖ్యత హెచ్చును. జీవితంలో స్థిరత్వం పొందగలరు. ఆడవారు మీతో ప్రేమగా ఉంటారు. శతృత్వములు అంతరించును. జీవనవిధానములో మార్పులు కలుగును. కొన్ని విషయాలలో కొంత ఆందోళన కలిగించినా అంతగా బాధించదు. యోగకాలం. సంఘంలో గౌరవమర్యాదలు పెరుగును.

మొత్తం మీద ఈసం॥రం అన్నివిధములుగా యోగదాయకమే. అష్టమ గురుడు అంతగా అపకారం చేయదు. శని, రాహువులు బలీయంగా ఉండుట లాభించును. ఎంతటి పనులైన సులువుగా పూర్తి చేయగలరు. గత 2 1/2 సంవత్సరముల కంటే ఈ సంవత్సరం చాలా బాగుండును.

**చైత్రం :-** అన్నివిధాలుగాఅన్నిరంగాలవారికిలాభదాయకమేచేయువృత్తి వ్యాపారాలందు అనుకూలించును. గృహంలో వివాహాది శుభకార్యలాభం, బంధు మిత్ర సమాగమము. ఆరోగ్యలాభం, వ్యవహారలాభం, సంతానసౌఖ్యం, కుటుంబవృద్ధి, ఉన్నతవర్గీయులతో కలయిక స్త్రీ సౌఖ్యం, స్పెక్యులేషన్‌లో అనుకూలత, లాభములు కలుగును. ప్రయాణ సౌఖ్యం, భార్యాభర్తల మధ్య సరైన అవగాహన ఉంటుంది.

**వైశాఖం :-** వృత్తివ్యాపార,వ్యవహారాదులందు అనుకూలించిననూ కోపం హెచ్చును. ఒక్కోసారి ఏమిమాట్లాడతారో తెలియదు. ఉద్రేకంతోఉంటారు. చీటికీ మాటికీచిరాకులు. అసహనంతోఉంటారు. ప్రతీచిన్నవిషయానికిఆందోళన చెందుదురు. గృహలాభాలు, స్త్రీమూలక ధనవ్యయం, సంతానంవల్ల భార్యాభర్తల మధ్య స్వల్పంగా విరోధములు, కలహాలు. సోదర విరోధాలు, పరామర్శలు చేయుదురు.

**జ్యేష్ఠం :-** ఈనెలలోకూడాపరిస్థితులుఅనుకూలించవు.గ్రహప్రభావంవల్ల భూసంబంధ వ్యవహారాలందునష్టాలు. తగవులు,ప్రయాణాలందు ఇక్కట్లు, సోదరులతో విరోధాలు. ఉద్దేశ్య పూర్వకంగా మిమ్మల్ని అవమానించెదరు. ఉద్రేకం ఉండుటచే పూర్తికావలసిన పనులు ఆలస్యమగుటచే ధననష్టం. ఉద్యోగులకు స్థానచలనం.

**ఆషాఢం :-** ఈనెలలోకూడా 8వ ఇంటగ్రహాలు వల్లచాలా చికాకుగా ఉంటుంది. ఆరోగ్యంబాగుండదు. ఆర్థికంగా ఇబ్బందులు ఉన్నప్పటికీ అవసరానికి ధనంచేతికందును. శారీరకగాయాలు. మనోదుఃఖం. ప్రయాణాలందుఇబ్బందులు. కోర్టుకేసులువల్లఇబ్బందులు. సంతానంవల్లనష్టాలు. అనుకోనిదుస్సంఘటనలుజరుగును.

**శ్రావణం :-** అన్నివిధములుగా బాగుంటుంది. అన్నిరంగములవారికి యోగమే. ఆరోగ్యంబాగుండును. ఆర్థికంగా బాగుండును. ధైర్యంగా ముందుకు పోగలరు. ఉత్సాహంతో, ఉల్లాసంగా పనిచేస్తారు. కుటుంబసంతోషాలు, వాహనసౌఖ్యం, మాతృవర్గీయులరాక, సంతానసౌఖ్యం,నూతన వస్తులాభం, దైవసంబంధకార్యములు చేయుదురు. వృత్తివ్యాపారాలు బాగుండును. పరిచయములు వలన లాభం.

**భాద్రపదం :-** ఏపని తలపెట్టినా అవలీలగా పూర్తిచేయగలరు. అన్ని విధాలుగా లాభమే. ఆరోగ్యలాభం. ధనమునకు ఇబ్బందిఉండదు. పరాక్రమంతో ఉంటారు. ఎంతటివారినైనాఎదురిస్తారు. వాదోపవాదాలతో మీదే పై చేయి. వాహనసౌఖ్యం, దూరప్రయాణాలుకలిసివచ్చును. శతృవులపై విజయం, విలాసవంతమైన ఖర్చులు.

**ఆశ్వీయుజం :-** గ్రహముల అనుకూల సంచారంవలన ప్రథమార్థంలో బాగా లాభించును. మీ మాటకు తిరుగుండదు. ప్రతి ఒక్కరూ గౌరవిస్తారు. ఆరోగ్యంగా, ఆర్థికంగాబాగుండును. పలుకుబడిపెరుగును. గృహసంబంధకార్యాలుపూర్తి. సంతానసౌఖ్యం. శతృవులే మిత్రులై సహకారాలు అందించెదరు. నూతన పరిచయలాభం.

**కార్తీకం :-** ఈనెలలో మిశ్రమఫలితంగా ఉంటుంది. ప్రథమార్థంలో బాగా అనుకూలించును. ఆర్థికంగాఆరోగ్యంగాబాగుంటుంది. ద్వితీయార్థంలో అన్నింటా అపజయం,ఊహించనిసమస్యలు. ధనవ్యయం,ఇతరులతోమాటామాటాపట్టింపులు. వ్యవహారనష్టాలుకలుగును. ప్రభుత్వసంబంధ లావాదేవీలు నష్టం. వాహనభయం.

**మార్గశిరం :-** గ్రహాలు అనుకూలంగా ఉన్నందువల్ల మనం అనుకున్నది ఒక్కటి జరిగేది మరొక్కటి. వ్యాపారాదులలోనష్టాలు. స్త్రీమూలకఇబ్బందులు. పటుత్వం కోల్పోవుదురు. మాట్లాడితే విరోధాలు. జాయింటు వ్యాపారస్థులు విడిపోవుదురు. భార్యాభర్తల మధ్య చీటికీమాటికీతగాదాలు. దూరం అయ్యే పరిస్థితివరకువచ్చును.

**పుష్యం :-** ఆదాయం బాగుంటుంది. వ్యవహారాదులలో జయం. కాని అధికధనవ్యయం,దుబారాలుచేయుట,వ్యవహారలాభం,సంతానసౌఖ్యం,శతృవులపైఆధిక్యత, మనోల్లాసం, స్త్రీసుఖాలు,స్పెక్యులేషన్‌లో లాభాలు. పెద్దవారిని కలుసుకొనుటజరుగును. నూతన వస్తు, వస్త్ర ప్రాప్తి, బంధుమిత్రులతో కలిసి విందులు, వినోదములు.

**మాఘం :-** పరిస్థితులు అనుకూలించవు. ప్రతివిషయంలో మొండిగా వ్యవహరిస్తారు. పట్టుదల, కోపం, చిరాకువల్ల విలువైన పనులు కోల్పోవుదురు. అందరితోనూ కటువుగా మాట్లాడుటవలన విరోధములు అధికమగును. ధనంకూడా నష్టపోవుదురు. సంఘంలోఅపఖ్యాతి,అనవసరవిషయాలలోజోక్యం చేసుకుంటారు.

**ఫాల్గుణం :-** కొంత దూకుడు తగ్గుతుంది. కోపం తగ్గి శాంతియుత వాతావరణంలోకివచ్చెదరు. ఆర్థికంగాపరిస్థితులులాభించును. ఆరోగ్యలాభం,ధనలాభం, వాహనసౌఖ్యం, కుటుంబసౌఖ్యం, సంతానసౌఖ్యం, నూతన పరిచయలాభాలు, వ్యవహారజయం, పనులు పూర్తి అగును. వివాహాది శుభకార్యములకు హాజరగుట.



# ధనుస్సురాశి ఫలితములు

**మూల 1,2,3,4, పాదములు పూర్వాషాఢ 1,2,3,4, పాదములు ఉత్తరాషాఢ 1 పా॥**

**ఆదాయం - 5 వ్యయం - 5 | రాజపూజ్యం - 1 అవమానం - 5**

**ఈ రాశివార్కి శని 4,3 లలో లోహ, సువర్ణమూర్తులు, గురుడు 7వ ఇంట తామ్రమూర్తి, రాహువు, కేతువులు 3, 9 లలో సువర్ణమూర్తులు.**

ఈ రాశివార్కి ఈసం॥రం గురు,శని రాహువుల బలంగా ఉండుటచే రాజ యోగంను అనుభవించెదరు. జీవనం పట్టిందల్లాబంగారమా? అనునట్లు ఒడును. సాంఘికంగా రాజకీయంగా ఉన్నత స్థితిలో ఉంటారు. గృహంలో మార్పులు, నూతన గృహ నిర్మాణం లేదా ఇండ్ల స్థలం కొనుట జరుగును. నూతన వాహన ప్రాప్తి, మీలోగలప్రతిభకు చక్కనిగుర్తింపువచ్చును. అనేక సేవా కార్యక్రమములందు పాలు పంచుకుంటారు మీ స్వశక్తితో బాటు గ్రహబలం, దైవబలం తోడుగుటచే జీవితం ఆనందంగా ఉల్లాసంగా ముందుకుసాగును. దూరప్రయాణాలు చేయు దురు. బంధుమిత్రులతో కలిసి తీర్థయాత్రలు చేయుదురు. దీర్ఘకాల వ్యాధులు వున్నవార్కి ఈ సం॥ కొంత ఉపశమనంకలుగును. నూతన కార్యములకు శ్రీకారం చుట్టెదరు. సంఘంలో గౌరవ మర్యాదలు పెరుగును. ఏ వృత్తితో జీవించువారికైనా ఈ సం॥రం లాభదాయకం. చక్కటి కుటుంబ వాతావరణం కలిగి ఉంటారు. మీ మనోధైర్యంతో ప్రతీవిషయంలోనూ పై చేయి సాధించెదరు. ఎంతటి వారినైనా మీ చాతుర్యంతో వశపరచుకొని కార్యములు సాధించెదరు. విలువైన వస్తువులు కొంటారు. ఏ పని తలపెట్టినా ఏవిధమైనా ఆటంకములు లేకుండా పూర్తగును. గత సంవత్సరం కంటే ఈ సంవత్సరంచాలా యోగదాయకమైన సంవత్సరం అనేక పనులలోవిజయం సాధించగలరు. మిమ్మల్ని చూడగానే అందరికి గౌరవభావం ఏర్పడును. దూర ప్రాంత ప్రయాణములు, తీర్థయాత్రలు పుణ్యనదీ స్నానములుచేయుదురు. ఉద్యోగస్తులకు ప్రమోషన్‌తో కూడిన బదిలీలు జరుగును.

మొత్తం మీద ఈ రాశివార్కి మంచి యోగదాయమైన సంవత్సరం మీ మేథస్సుకు తోడు గ్రహబలం, దైవబలం తోడగును.

**చైత్రం :-** అన్నిరంగాలవారికియోగమే. చేయువృత్తి వ్యాపారాలు అనుకూలించును. ఆదాయం బాగుంటుంది. ఆరోగ్యలాభము. మిత్రుల సహాయసహకారములు లభించును. బంధుమిత్రసమాగమము. గృహంబులో శుభకార్యములు జరుగును. సంతానసౌఖ్యం,శతృవులపైఆధిక్యత. నూతనపరిచయాలువల్లలాభాలు. సంఘంలో పేరు ప్రఖ్యాతులు పెరుగును. ఉద్యోగులకు ప్రమోషన్స్‌తో కూడిన బదిలీలు.

**వైశాఖం :-** అన్నివిధాలుగాబాగుండును. ఆదాయంనకులోటుండదు. సమస్యలు మబ్బువిడినట్లు విడిపోవును. సాంఘికంగా వృద్ధిలో ఉంటారు. వాహనసౌఖ్యం. స్పెక్యులేషన్ అనుకూలత. సంతానం ద్వారా సంతోషవార్తలు. శతృవులపై జయం. మనశ్శాంతి. నూతనవస్తుప్రాప్తి. యశోభూషణ ప్రాప్తి. వ్యవహారాదులందు లాభము. కోర్టు వ్యవహారములందు జయము. ధనం అనవసరంగా ఖర్చుచేయుదురు.

**జ్యేష్ఠం :-** ఈనెలలో ప్రథమార్థం చాలా బాగుంటుంది. అందరకూ అనుకూలి ంచును. ద్వితీయార్థంనుండి అనేక ఇబ్బందులు. ప్రతీచిన్నవిషయానికి ఉద్రేకప డుట. అసహనం. అధికకోపం. అందరితోనూ విరోధములు. ఆరోగ్యభంగములు. వాహన ప్రమాదాలు. నమ్మినవారే దగాచేయుట, ఆదాయమునకు ఇబ్బందులు.

**ఆషాఢం :-** 8వఇంట గ్రహ సంచారంవల్ల అనేక ఇబ్బందులు కల్గును. మనః స్థిమితం ఉండదు. అధైర్యంతో ఉంటారు. చేయువృత్తి వ్యాపారములు కలసిరావు. దూరప్రయాణాలందుకష్టాలు. ప్రతీచిన్న విషయానికి జాగ్రత్త అవసరం. వాహన ప్రమాదం, బంధుమిత్రులతో విరోధాలు. శారీరకశ్రమ, కార్యాలు నిలచిపోవుట.

**శ్రావణం :-** ఈనెలలోకూడాఉద్యోగులకుచాలా ఇబ్బందులు. భార్యాభర్తల మధ్య మాటామాటాపట్టింపులు. ఉద్రేకంతోఉంటారు. సంతానంవల్ల కూడా ఇబ్బందులే. ఆరోగ్యంబాగుండదు. శస్త్రభయం. ఊహించనిఆందోళనపడేసంఘటనలుజరుగును. స్నేహితులువల్లనష్టాలు. కార్యాలుమధ్యలోనిలచిపోవును. ద్వితీయార్థంలోకొంతఊరట.

**భాద్రపదం :-** ఈనెలప్రథమార్థంబాగుండదు. ద్వితీయార్థంలో కొంతమేర అను కూలించును. ఆరోగ్యంచక్కపడును. ఆర్థికంగా ఫర్వాలేదనిపించును. అవసరానికి ఏదోలాధనంలభించును. కుటుంబసంతోషాలు. వాహనసౌఖ్యం. బంధుమిత్రలాభ ములు. వ్యవహారాలందుఅనుకూలత, భార్యాభర్తలమధ్యమాటా మాటా పట్టింపులు.

**ఆశ్వీయుజం :-** గ్రహములు కొంతమేర అనుకూలసంచారంవలన చేయువృత్తి వ్యాపారములు అనుకూలత. అన్నిరంగాలవారికి బాగుండును. ఆర్థికలావాదేవీలు సంతృప్తికరం, ఉద్యోగులకుబదిలీలు. గృహమార్పులు, స్థానమార్పులుతప్పవు. దైవదర్శనం, ప్రయాణసౌఖ్యాలు. నూతన పరి చయలాభం, నూతన వస్తు ప్రాప్తి.

**కార్తీకం :-** ఈనెలలో ప్రథమార్థంబాగుండును. అన్నివిధములుగా యోగించును. ద్వితీయార్థంలో యోగగ్రహాలు 12వఇంట ఉండుటచే ఇబ్బందులు. అధికధన వ్యయం, దుబారాలుచేయుట, అనేక క్రొత్తసమస్యలుఎదురగును. పేరు ప్రఖ్యాతులపై దెబ్బకొట్టును. ఆరోగ్యవిషయంలోఫర్వాలేదు. అవమానకర సంఘటనలు జరుగును.

**మార్గశిరం :-** ఈ నెలలో మిశ్రమ ఫలితాలు ఉండును. ప్రథమార్థం కంటే ద్వితీయార్థం కొంత మెరుగ్గా ఉంటుంది. అయినప్పటికీ కొన్నింటిలో నష్టములు, అపఖ్యాతితప్పదు. వృత్తివ్యాపారాలునెమ్మదిగా సాగును. ఆర్థికంగా కొంతఫర్వాలేదు. కాని కొన్నిపనులు మధ్యలో నిలచిపోవుట, అసహనం. ఉద్రేకంగా మాట్లాడుట.

**పుష్యం :-** చేయువృత్తివ్యాపారములు ఫర్వాలేదనిపించును. ఎంత ఆదాయం వచ్చినా మంచినీళ్ళవలెఖర్చగును. ఋణాలు చేయవలసివచ్చును. నూతన వస్తు, వస్త్రలాభములు. దూరప్రయాణములు, బంధుమిత్రులతో కలయిక, మాసాంతంలో నేత్రపీడలు, కళత్రవంశంవారితో విరోధాలు. పాతమిత్రులను కలుసుకుంటారు.

**మాఘం :-** అన్నిరంగాలవారికి యోగించును. ఆర్థికంగా ఫర్వాలేదు. ధైర్యంగా నిలబడగలరు. మిత్రులసహాయ సహకారాలు లభించును. కుటుంబసౌఖ్యం, సంతా నం ద్వారా లాభాలు. శత్రుమూలకలాభం, పనులు పూర్తిచేయగలరు. గృహంలో శుభకార్యాలు, ఉత్సాహంగాఉంటారు. వృత్తివ్యాపారాలందు రాణింపు ఉంటుంది.

**ఫాల్గుణం :-** చేయు వృత్తివ్యాపారాలు అనుకూలంగా ఉన్నప్పటికీ అధిక ధన వ్యయం, సేవకులుమూలంగా ధననష్టం, విలువైనవస్తువులు పోగొట్టు కుంటారు. ప్రయాణములందు నష్టములు. ప్రభుత్వ సంబంధ కార్యములందు నష్టములు. సోదరవర్గంవారితో నష్టములు. ద్వితీయార్థం అందరికీ అనుకూలంగా ఉండును.



# మకరరాశి ఫలితములు

**ఉత్తరాషాఢ 2,3,4 పాదములు**

**శ్రవణం 1,2,3,4 పా॥ ధనిష్ట 1,2, పాదములు**

**ఆదాయం - 8 వ్యయం - 14** | **రాజపూజ్యం - 4 అవమానం - 5**

**ఈ రాశి వార్కి శని 3,2లలో సువర్ణ, రజిత మూర్తులు, గురుడు 6వ ఇంట రజిత మూర్తి, రాహు, కేతువులు, 2, 8లలో లోహమూర్తులు.**

ఈ రాశి స్త్రీ పురుషాదులకు పెద్ద గ్రహముల బలం బాగున్నది. ఇది శని యొక్క రాశి. ఏల్నాటిశని దోషం పూర్తిగా తొలగినది. తాముపట్టినది బంగారమా? అన్నట్లుగా ఉండును. గృహములోనూ, పైనా ప్రాముఖ్యమైన, లాభదాయకమైన పనులు చేయుటచే గౌరవాదులు, బహుమానములు పొందుట జరుగును. అప్రయత్న ధనలాభాలు, స్పెక్యులేషన్‌లాభించును. అన్నివర్గములవారికి గడచిన రెండుసంవత్సరముల కంటే బాగా యోగించి కలిసివచ్చును. స్వశక్తి సామర్థ్యం పెరుగును. గృహంలో వివాహాది శుభకార్యాలు కలసివచ్చును. పుణ్యనదీస్నాన ఫలప్రాప్తి, నష్టద్రవ్యలాభము. జీవితాధిక్యత, అధికారం వహించుట, శత్రువులను పాదాక్రాంతులుగా చేసుకొనుట, వాహనసుఖం, అన్యస్త్రీ పరిచయం, అధిఖ్యాత, ఆదాయంనకు మించిన ఖర్చులు అధికారప్రాప్తి. పాతగృహం లేదా స్థలంకొంటారు. మీలో అణిగిఉన్న శక్తిసామర్థ్యాలు వెల్లడగును. ఒక్కోసారి శనిప్రభావం వలన అనవసర వాగ్వాదనలు చేయుదురు. వ్యవహారభీతి కలిగించును. దూర ప్రయాణాలు చేస్తారు. సోదర వర్గీయులతో విరోధం. ఏరకమైన వృత్తులలో జీవించు వారలకైనా యోగదాయకం. ఎవరికీ తలవంచే పనిలేదు. కాని దైవముచే లొంగదీయబడుట, మీకు స్థానబలం ఎక్కువ. ఎవరూ ఏమీ చేయలేరు. ఆదాయం హెచ్చును. మీ కంటే తక్కువవారివల్ల పనులు పూర్తి అగును. అధికారం హెచ్చును. గత 7 1/2 సంవత్సరములుగా పడుచున్నబాధలు తీరును ఏలినాటిశని బాధ పూర్తిగా తొలగును. ప్రశాంతమైన జీవనం అనుభవించెదరు. ప్రతీ పనిలోనూ విజయం లభించును. అనుకున్నది సాధిస్తారు. శత్రువులపై మీదే పైచేయి

మొత్తంమీద ఈ రాశివారందరికీ యోగకాలం అని చెప్పవచ్చును. పెద్దగ్రహములు అనుకూలించుటచే జీవితంలో స్థిరత్వం ఏర్పడును.

**చైత్రం :-** అన్నిరంగములవారికి యోగమే. చేయుపనులు ఫలించును. ఆర్థికంగా కొంతఇబ్బందులు, చివరినిమిషంలో గట్టెక్కుదురు. కుజదృష్టి వల్లఆరోగ్యభంగాలు తప్పవు. శారీరకశ్రమ,అలసట,చికాకులు కలిగించుసంఘటనలు, సంతానంద్వారా ఇబ్బందులు.మాసాంతంలోకొంతమార్పువచ్చును. శుభకార్యాలకు హాజరగుదురు.

**వైశాఖం :-** అన్నివిధములుగా చేయువృత్తి వ్యాపారములు అనుకూలించును. ఆరోగ్యం కుదుటపడును.ఆదాయంనకు లోటుండదు. గతంలో రావలసిన బాకీలు చేతికందును. వివాహాది శుభకార్యాలకు అనుకూలత, వాహనసౌఖ్యం, బంధు మిత్రులతో కలయిక, నూతన వస్తు ప్రాప్తి, వ్యవహారజయము కలుగును. ఉద్యోగులకు ప్రమోషన్స్‌తో కూడిన బదిలీలు. నూతన పరిచయాలు లాభించును.

**జ్యేష్టం :-** ఈనెలలోకూడా అనుకూలంగానేడుండును. చేయువృత్తివ్యాపారాలుఅనుకూలించును. సంఘంలోఉన్నతస్థితి. ఆర్థికలావాదేవీలుసంతృప్తి. శత్రువులపైఆధిక్యత. వ్యవహారజయం, సంతానంద్వారాసౌఖ్యం, గృహలాభం. నూతనపరిచయాలు లాభించును. ధైర్యంతో కూడినపనులు చేస్తారు. కోర్టు వ్యవహారాలందు జయం.

**ఆషాఢం :-** కుజ ప్రభావంచే కొన్నిపనులు నిలచిపోవును. ఆరోగ్యభంగములు, ప్రయాణములందు ఆటంకములు, పుణ్యనదీస్నానం, దొంగలవల్ల భయం, ధన నష్టములు, వాహనప్రమాదములు. రక్తబంధుఅరిష్టం. వ్యవహారాదులందు వ్యతిరేకత కుటుంబసౌఖ్యంతక్కువ. సోదరమూలకఇబ్బందులు, శారీరక శ్రమ అధికం.

**శ్రావణం :-** ఈనెలయందుఅన్నిరంగాలవారికి అన్నివిధములుగా బాగుంటుంది. ఆర్థికంగాఫర్వాలేదు. లోటుండదు. మనోధైర్యం. సాహసనిర్ణయాలు, అందరినిఎదిరించి మాట్లాడుట, వాహనసౌఖ్యం, మిత్రలాభం, బంధుమిత్రసమాగమం, పూజలు చేయుట, సంతానంవల్లలాభాలు. సంఘంలో పెద్దవారిని కలుసు కుంటారు.

**భాద్రపదం :-** గ్రహాలసంచారం అంతఅనుకూలంగాలేదు. ఆందోళనకలిగించు సంఘటనలుజరుగును. ఆర్థికంగా ఇబ్బందులు. ఊహించని సంఘటనలుఎదురగుట, దుఃఖము, శారీరకఇబ్బందులు. అకాలభోజనములు. మాట్లాడితేవిరోధం, పరువుకోల్పోవుట, అపనిందలు, వస్తునష్టము, సంతానంద్వారా ఇబ్బందులు.

**ఆశ్వీయుజం :-** ప్రభుత్వంరీత్యా ఇబ్బందులు. శారీరకఇబ్బందులు. రుగ్మత. ఔషధసేవ, ధనమునకుఇబ్బందులు. ఋణాలుచేయవలసివచ్చును. వాహనప్రమాదాలు. ఆప్తబంధుఅరిష్టం. నమ్మినవారేద్రోహంచేయుట, ఆరోపణలు ఎదుర్కొంటారు. ద్వితీయార్ధంలో అనుకూలించును. దైవసంబంధ కార్యములు చేయుదురు.

**కార్తీకం :-** మనస్సు ప్రశాంతత ఉండదు. కోపంతో మాట్లాడుదురు. అందరితోనూ విరోధములే. ఏమి మాట్లాడినా ఇతరులు మరొకలా అర్థం చేసుకుంటారు. ఉద్రేకస్వభావంవల్లకొన్నిపనులువాయిదాలుపడును. సోదరవర్గంవారితో కలహాలు. భూసంబంధవ్యవహారాలునష్టాన్నికల్గించును. చేయువృత్తివ్యాపారాలుకలిసివచ్చును.

**మార్గశిరం :-** గతనెలకంటే కొంతమేర అనుకూలించును. అయిన 8వ ఇంట కుజప్రభావంవల్లచికాకులుతప్పవు. ఆర్థికంగాకొంతకుదుటపడుదురు. వ్యాపారాలు వృత్తులువారికి బాగానేజరుగును. ఉత్సాహంగా, ఉల్లాసంగాఉంటారు. స్థానమార్పులు, ప్రయాణాలందు చికాకులు, ప్రమాదములు. సోదరులతో విరోధములు.

**పుష్యం :-** అన్నిరంగాలవారికి ప్రథమార్ధంబాగుండును. వ్యయమందు గ్రహసంచారంవల్లఇబ్బందులు, ద్వితీయార్ధంలాభించును. చేయువృత్తివ్యాపారాలు బాగుండును. ఆదాయంబాగుండును. వ్యవహారాదులు కలసి వచ్చును. నూతన, వస్తు, ప్రాప్తి. బంధుమిత్రసమాగములు. ప్రయాణలాభాలు, స్పెక్యులేషన్‌లోఅనుకూలం.

**మాఘం :-** గ్రహాల అనుకూల సంచారం లాభించును. అన్నివిధాలుగా లాభమే. ఆరోగ్యలాభం. ధనలాభం, సోదరలాభాలు, పాతవాహనాలు మార్పు, ఉద్యోగులకు ప్రమోషన్స్‌తోకూడినబదిలీలు. లేదాగృహమార్పులుతప్పవు. గృహంలో శుభకార్యాలు సంఘంలోఉన్నతస్థితి, సమస్యలుతొలగును. జన్మకుజునివల్ల ఉద్రేకంతోఉంటారు.

**ఫాల్గుణం :-** అనుకూల గ్రహసంచారం వల్ల చేయు వృత్తివ్యాపారము ఫర్వాలేదు. నూతనకార్యాలకు శ్రీకారంచుట్టెదరు. ఆరోగ్యంబాగుండును. ఆర్థికంగా సమస్యలుండవు. ధైర్యంతోముందుకు పోగలరు. విద్యార్థులు పరీక్షలు బాగా వ్రాయుదురు. శత్రువులపైజయం, స్త్రీ సౌఖ్యం. వివాహాది శుభకార్యములకు హాజరగుదురు.



# కుంభరాశి ఫలితములు

## ధనిష్ఠ 3,4 పా॥లు శతభిషం 1,2,3,4 పా॥లు పూర్వాభాద్ర 1,2,3 పాదములు

**ఆదాయం - 8 వ్యయం - 14** | **రాజపూజ్యం - 7 అవమానం - 5**

**ఈ రాశి వార్కి శని 2, 1లలో తామ్ర, లోహమూర్తులు, గురుడు, 5వ ఇంట లోహమూర్తి, రాహు, కేతువులు, 1,7లలో సువర్ణమూర్తులు.**

ఈరాశి స్త్రీ పురుషాదులకు ఏల్నాటిశని ప్రభావం అధికం. శనియొక్క రాశి గాన ధర్మకార్యాలు చేయుట, పుణ్యక్షేత్ర సందర్శనం, చేయువ్యాపారాదులలో ప్రాముఖ్యత, రావలసినబాకీలు వసూలగుట, స్పెక్యులేషన్‌లాభం, అప్రయత్న ధనలాభములు. ఆటపాటల పోటీలలో విజయం చేకూరును. గురుబలం వలన సంఘంలో పలుకుబడి పెరుగును. ఎటువంటి నూతనవ్యాపారం తలపెట్టినా విజయవంతమగును. తగాదాలు వ్యవహారములలో మీదేపైచేయి అగును. వెండి, బంగారం మొ॥గు విలువైన వస్తువులులభించును. భూ, గృహాదిస్థిరాస్తులు సంపాదించుట, నూతన కాంట్రాక్టులతోలాభాలు. కుటుంబ భారం హెచ్చుగా నుండును. మానసిక ఆవేదన పెరుగును. వీర్యబలం తగ్గి నరముల నిస్త్రాణ కలిగించును. తగిన ఔషధసేవ చేయుట మంచిది. గుప్త శత్రువులు, చోరభయం, రావలసిన సొమ్ముకుఆటంకం కలిగించినా తుదకుభర్తీఅగును. రాహు,కేతువులు వల్ల శారీరక బాధలు. చోరభయంవంటివి ప్రాప్తించును. గృహమార్పులు, స్థాన మార్పులు తప్పవు. నూతన కృషి ప్రయత్నలాభం. చేతివృత్తులచే జీవించువారికి ఎందులోనూ నష్టంరాదు. గాని మీ అహంభావము ఒకరికన్నా ఎక్కువ అనే గర్వమే మధ్య మధ్య మీ పతనమునకు కారణమగును. ఎవరినీ నిందించకూడదు. మీ విద్యాధిక్యత సూక్ష్మగ్రాహితనం, సున్నితమైనమనస్సుఅగుటచే అవిరాణించని కారణంగా లోలోపలబాధపడుదురు. దైవారాధనే మీకుశరణ్యం. మీభార్యతోవాదనలు చేస్తారు. సాంఘికంగా మీరువేసే పధకములకు ఊహించనిసంఘటనలు సిద్ధించును.

మొత్తం మీద ఈరాశి స్త్రీపురుషాదులకు గురు ప్రభావంవల్ల చాలా యోగదాయకంగాఉండును. జన్మరాహువువల్ల గృహంలోమార్పులు, స్థానచలనం, కోర్టు కేసులందుఇరుక్కొనుట,లేనిపోని అపవాదులు మనఃస్థిమితంలేకుండుటజరుగును.

**చైత్రం :-** అన్నివిధములుగా అన్నిరంగాలవారికియోగమే. చేయు వృత్తి వ్యాపారాలందు రాణింపు, ఆరోగ్యం బాగుండును. ఆర్థికలావాదేవీలు సంతృప్తిగా ఉండును. మనోల్లాసం, యత్నకార్యసిద్ధి, ఉన్నతస్థితి, శత్రువులపైజయం, వాహనసౌఖ్యం, నూతన పరిచయాలువల్ల లాభాలు, కుటుంబవృద్ధి, శుభకార్యాలకు హాజరగుదురు.

**వైశాఖం :-** అందరికీ యోగదాకమే. ఉద్యోగులకు ప్రమోషన్‌తోకూడిన బదిలీలు గౌరవలాభం, ఆదాయంనకు లోటుండదు. గతంలోఉన్న అనేక సమస్యల నుండి బయటపడుదురు. గృహంలో వివాహాది శుభకార్యాలు కలసివచ్చును. మిత్రసహకారంతో కార్యజయం, శత్రుజయం, కుటుంబసౌఖ్యం, కోర్టువ్యవహారాలు అనుకూలత, విద్యార్థులు పరీక్షలలో ఉత్తీర్ణులగుదురు. అనుకున్నది సాధిస్తారు.

**జ్యేష్ఠం :-** ఈ నెలయందు అనుకూల వాతావరణం ఉంటుంది. ఏపనితలపెట్టినా విజయంఅగును. బంధుమిత్రుల సహాయసహకారం లభించును. నూతన కార్యములకు శ్రీకారంచుట్టెదరు. వాహనమార్పులు, గృహమార్పులు, నూతన వస్త్రప్రాప్తి, కుటుంబంలో అందరితోనూ మైత్రి, చేయువృత్తి వ్యాపారాలు కలిసి వచ్చును.

**ఆషాఢం :-** అన్నింటా జయం, అన్నివర్గాలవారికి అన్నివిధాలుగా బాగుంటుంది. వృత్తివ్యాపారాలు కలిసివచ్చును. దూరప్రయాణాలు కలసివచ్చును. పుణ్యనదీ స్నానములు. దైవదర్శనంచేయుదురు. వాహనసౌఖ్యం, భూసంబంధలావాదేవీలు లాభించును. ఇతరుల విషయంలో జోక్యంచేసుకుంటారు. నూతన పరిచయలాభం.

**శ్రావణం :-** ఈ నెలలో కూడా లాభదాయకంగా ఉంటుంది. ఆరోగ్యలాభం, ఆదాయంబాగుంటుంది. ఏసమస్యాలేకుండా సరదగా కాలంగడచును. అనుకున్న పనులు సాధిస్తారు. పెద్దవారితో పరిచయాలు. కుటుంబసౌఖ్యం, అందరితోసఖ్యత, వాహనలాభం, ప్రయాణసౌఖ్యం, సంతానసౌఖ్యం, స్పెక్యులేషన్ అనుకూలమే.

**భాద్రపదం :-** ఈనెలలో 8వఇంట గ్రహసంచారంవల్ల కొంత ఇబ్బంది తప్పదు. చేయువృత్తివ్యాపారాదులందు ఆటంకములు. వ్యతిరేకత, బంధుమిత్రులతో మాటామాటాపట్టింపులు, అనవసరఖర్చులు, ఆరోగ్యభంగములు, ఔషధసేవ, వాహనభయం, ప్రమాదములు , ఊహించని సంఘటనలు ఎదురగును.

**ఆశ్వీయుజం :-** ఈనెలలో మిశ్రమఫలితాలు ఉండును. కొన్నింటిలో విజయం, కొన్నింటిలోఅపజయం. ఆర్థికపరిస్థితులుఅనుకూలత. ఊహించని దుస్సంఘటనలుజరుగును. ఇతరులకుహామీలుండుటవలన ఇబ్బందులుతప్పవు. కుటుంబంలో మనశ్శాంతి, సంతోషవార్తలు వినుట. దైవదర్శనములు, వ్యవహారలాభం.

**కార్తీకం :-** ఈనెలలో ప్రథమార్థంలో అనేక సమస్యలు ఎదుర్కొనవలసి వచ్చును. ఏపనిచేయబుద్ధికాదు. పనులందు ఆటంకములు, సోదరులతో కలహములు, చీటిమాటికి శారీరకగాయాలు దెబ్బలు తగులుట, గృహంలో వస్తురిపేర్లువచ్చుట, ఆరోగ్యభంగాలు, గృహమార్పులు, స్థానమార్పులు, ద్వితీయార్థంలోఅనుకూలించును.

**మార్గశిరం :-** ఈనెలలో ప్రతీ విషయం ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. 16వతేదీనుండి కొంతమేరపరిస్థితులుఅనుకూలించును. ఆరోగ్యం కుదుటపడును. సమస్యలు కొన్ని పరిష్కారమగును. ఉత్తేజంగా, ఉల్లాసంగా ఉంటారు. స్త్రీ మూలక ధనలాభములు. చేయువృత్తి వ్యాపారములందు రాణింపు. ఆర్థికంగా బాగుండును.

**పుష్యం :-** ఈ నెలలో ప్రథమార్థం బాగుండును. చేయు వృత్తివ్యాపారములు అనుకూలించును. ఆదాయము బాగుండును. ప్రయాణాలు, నూతనవస్తు, వస్త్రప్రాప్తి, బంధుమిత్రులతో కలిసి విందులు, వినోదాలు. ద్వితీయార్థంలో, 12వ ఇంట గ్రహసంచారము వల్ల ఇబ్బందులు, ఊహించని సమస్యలు ఎదురగును.

**మాఘం :-** ఈనెలలో ప్రథమార్థం అనుకూలించును. అనుకున్నవి నెరవేరును. గృహలాభాలు, గృహంలో వివాహాదిశుభకార్యాలు, సంతానసౌఖ్యం, ద్వితీయార్థం అనేక సమస్యలు. ఆదాయంనకు మించినఖర్చులు. దుబారాలు చేయుట, శిరోబాధలు, ఔషధసేవ, ప్రయాణాలందు కష్టాలు, భార్యాభర్తల మధ్య వివాదములు.

**ఫాల్గుణం :-** ఈనెలలోమిశ్రమఫలితాలుఇచ్చును. వ్యాపారలావాదేవీలు అనుకూలత, ఆర్థికంగా బాగుంటుంది. పనులందు మాత్రం ఆటంకాలు, ఆరోగ్యం కూడా ఫర్వాలేదు. కానినేత్రపీడలు. శత్రుమూలకంగా భయాందోళనలు, కుటుంబవ్యక్తులతో విరోధములు, భార్యతో ఒకటిరెండు రోజులు మాట్లాడకుండుట జరుగును.



# మీనరాశి ఫలితములు

**పూర్వాభాద్ర 4వ పాదము, ఉత్తరాభాద్ర 1,2,3,4 పా॥లు రేవతి 1,2,3,4 పా॥లు**

**ఆదాయం - 5 వ్యయం - 5** | **రాజపూజ్యం - 3 అవమానం - 1**

**ఈ రాశి వార్కి శని 1, 12లలో రజిత, తామ్రమమూర్తులు, గురుడు 4 వ ఇంట తామ్రమూర్తి, రాహువు, కేతువులు 12, 6 లలో తామ్రమూర్తులు.**

ఈ రాశి స్త్రీ పురుషాదులకు ఏల్నాటి శని ప్రభావం, ద్వాదశమందు రాహువు వలన జీవితం పరీక్షా కాలమా ? అనునట్లుండును. మీలో గల శాంతము. వినయం, ఔదత్యాది గుణములున్ననూ నెగ్గుకు రాలేదు. ఎంతకష్టపడి పనిచేసినా ఫలితం శూన్యమే అగును. నిరాశ, నిస్పృహులతో జీవితం ఉంటుంది. కొంత ఆడవారి రీత్యా మీ మనోవాంఛలు సిద్ధించును. శారీరబలం తగ్గి బాధపడుదురు చేయలేని వాటికి అపనిందలు ఎదుర్కోనవలసి వచ్చును. అవమానకరసంఘట నలు ఎదుర్కొంటారు. ఒక్కోసారి ఇతర కార్యములకు మీరు ఋణముచేసి అయినా వార్కి సహాయపడుదురు. పుణ్యక్షేత్ర సందర్శనము చేయుదురు. గృహంలో బాధలు, భార్యకు, సంతానమునకు తండ్రి వర్గీయులకు శారీరక బాధలు, కోర్టు కేసులందు ఇరుక్కుంటారు. ఆదాయంనకుమించిన ఖర్చులు. ఋణాలు చేయవలసి వచ్చును. గుప్తశతృవుల వల్ల బాధలు అనేక రక్తబంధుపీడలు, జీవన విధానంలో మార్పులు, సోదరవర్గం వారితో విరోధాలు, విలువైన వస్తువులు పోగొట్టుకుంటారు. దొంగలు వలన భయం, భార్యకు ఆరోగ్య భంగములు తప్పవు. ప్రతీ విషయంలో జాగ్రత్తగా వ్యవహరించాలి. గ్యాస్ ట్రబుల్స్ షుగర్, బి.పి. వంటి వ్యాధులు, ఉదర సంబంధ వ్యాధులువచ్చును. చాలాజాగ్రత్తగాఉండేది. 4వ ఇంట గురుడు ఉన్ననూ ఏల్నాటి శనిప్రభావం అధికంగా ఉండును. ప్రతీ విషయంలోనూ భయాందోళనలుతప్పవు. ఈ సంవత్సరం అన్నివిధాలా ఇబ్బందులు కలిగించను. ప్రతి నిమిషము జాగ్రత్తగా ఆలోచించి ముందుకునడవాలి. అశ్రద్ధ చేసినచో అనేక ఉపద్రవములు జరుగును.

మొత్తం మీద ఈ స్త్రీ పురుషులకు ఏల్నాటి శని ద్వాదశి రాహువు వలన పరీక్షా కాలామా? అనునట్లుండును. మీలో గల నేర్పు, దైవబలం వలన కొంత ఊరట కలిగించును.

**చైత్రం :-** ఈనెలలో ప్రధమార్ధం కొంత ఇబ్బందులు. శారీరకశ్రమ, అలసట, ఆరోగ్యభంగాలు. సమస్యలువల్లఇబ్బందులు. బంధుమిత్రవిరోధాలు. వాహన ప్రమాదాలు.దొంగతనాలు, అనవసరంగా మాటలుపడుట. భయాందోళనలు కలిగించు సంఘటనలు, స్త్రీ విరోధాలు, ద్వితీయార్ధంకొంతమేరబాగుంటుంది.

**వైశాఖం :-** అన్నిరంగములవారికి చేయువృత్తి వ్యాపారాలందు రాణింపు ఉంటుంది. ఆరోగ్యలాభాలు.ఆదాయంబాగుండును.సాహసనిర్ణయాలు తీసుకుం టారు. శతృజయం, వాహనసౌఖ్యం, గృహంలోశుభకార్యాలు.సంతాన సౌఖ్యం, స్త్రీమూలకలాభాలు. పెద్దవారితోపరిచయాలు, దూరప్రయాణములు లాభించును. వివాహాది శుభకార్యములకు హాజరగుదురు. గృహనిర్మాణాలు కలిసి వచ్చును.

**జ్యేష్ఠం :-** మీ మాటకు తిరుగుండదు. వ్యవహారజయం, ధనలాభం, రావలసిన బాకీలు చేతికందును. నూతనవస్త్రప్రాప్తి. స్థిరాస్తులువృద్ధి. భూ సంబంధవ్యవహారాలందుపాల్గొనుట, గృహసౌఖ్యం,విందులు,వినోదాలు,రాజకీయంగా అధికారులను కలుసుకుంటారు. ఇతరులపనులకుఎక్కువసమయంవినియోగిస్తారు. వ్యవహారజయం.

**ఆషాఢం :-** ఈనెలలో కూడాఅనుకూలం. అన్నిరంగాలవారికి అన్నివిధములుగా బాగుంటుంది. వృత్తివ్యవహారాలందు మీదే పైచేయి. ధనలాభం, ఆరోగ్యలాభం, మిత్రలాభం, బంధుమిత్ర సంతోషాదులు, వాహనసౌఖ్యం, సంతానసౌఖ్యం, శత్రుజయం,సంఘంలోకీర్తిలాభం,పుణ్యనదీస్నానం,దైవదర్శనాలు,ప్రయాణసౌఖ్యం.

**శ్రావణం :-** అందరికీ పరిస్థితులు అనుకూలంగా ఉండవు. మీమాటకు గుర్తింపు ఉండదు. పనులందు వ్యతిరేకత. ఆర్థికలావాదేవీలు ఇబ్బంది. మనోధైర్యం కోల్పోవుదురు. గృహంలో సంతోషం,కీర్తిలాభం,ఇతరులవిషయంలోజోక్యంచేసుకొనుట, విందులు వినోదాలు, ఇతరులను పరామర్శలుచేయుట. మాతృవర్గసూతకములు.

**భాద్రపదం :-** కుజ ప్రభావంవల్ల అనేకసమస్యలు ఏర్పడును. ఆరోగ్యభంగం, ధనముకు ఇబ్బందులు. మనోధైర్యంకోల్పోవుదురు. వాహనంరిపేర్లు. గృహములో అశాంతి. దూరప్రయాణములు,చికాకులు కలిగించే సంఘటనలు జరుగును. వ్యవహారాలు ఆగిపోవును. సంతానముద్వారా పీడలు. భార్యతో విభేదాలు.సౌఖ్యం.

**ఆశ్వీయుజం :-** ఉద్రేకంగా మాట్లాడుట, ప్రతీచిన్న విషయానికి ఆందోళన, చికాకులు కలిగించు సంఘటనలు, శారీరకగాయములు. వాహన ప్రమాదములు. బంధుమిత్రవిరోధాలు. భార్యతోకూడాగొడవలు,శత్రుభయం, పనులు స్తంభించుట, ఆర్థికసమస్యలు కూడావెంటాడును. ధనంమంచినీళ్ళవలెఖర్చు, జాగ్రత్త అవసరం.

**కార్తీకం :-** ప్రథమార్థంలోఆరోగ్యభంగాలు. ఆర్థికఇబ్బందులు,ఋణాలు చేయవలసివచ్చును. మాట్లాడితే విరోధములు. సోదరులతో కలహములు. పితృ, మాతృ, కళత్ర వర్గీయుల సూతకములు, పరామర్శలుచేయుట. మనఃస్తిమితంఉండదు. చికాకులు, ఆందోళనలు కలుగును. స్త్రీ మూలకవిరోధములు, శిరో, నేత్ర పీడలు.

**మార్గశిరం :-** ఈనెల గ్రహసంచారం బాగుంది. చేయువృత్తి వ్యాపారములు రాణించును. ఉద్యోగులకు స్థానమార్పులు, గృహమార్పులు, సమస్యలు తీరును. వాహనలాభం, సంతానంద్వారా లాభములు. నమ్మినవారి వలన లబ్ధి చేకూరును. ధనలాభము. నూతనవస్త్ర ప్రాప్తి, ప్రభుత్వ సంబంధ వ్యవహారాలందు జయం.

**పుష్యం :-** పరిస్థితులు కొంతమేర అనుకూలించును. అయిన కొన్ని విషయాలలో చాలా జాగ్రత్తగా ఉండాలి. అనవసరంగా మిమ్మల్ని వేధించుదురు. ఆందోళన, కలవరంపడుసంఘటనలు,కోపంగామాట్లాడుట,దూరప్రయాణాలువాహనప్రమాదములు. సోదరవిరోధాలు బాధించును. బంధుమిత్రులతో విందులు, వినోదం.

**మాఘం :-** ఈనెలలోఅన్నిరంగాలవారికిఅనుకూలమే. చేయువృత్తివ్యాపారములు లాభం. ఆరోగ్యంబాగుంటుంది. ధనలాభాలు. బాధలనుండి ఉపశమనం, సంతోషవార్తలు వివాహాదిశుభకార్యలాభం,సంతానసౌఖ్యం,శత్రువులపైజయం, భార్యతో సఖ్యత, స్త్రీసౌఖ్యములు, దైవదర్శనములు, సంఘంలోకీర్తి, యశోభూషణప్రాప్తి.

**ఫాల్గుణం :-** వ్యాపార, వ్యవహారాలు అనుకూలించినా ఆర్థికంగా ఇబ్బందులు. ధనం మంచినీళ్ళవలె ఖర్చగును. ఇంట్లో అందరికీ ఏదోరకమైన ఇబ్బందులు. మందులవాడకంపెరుగును. బంధుమిత్రులతో ఆచితూచివ్యవహరించాలి. నూతన వ్యక్తులపరిచయం. ఆరోగ్యవిషయంలోజాగ్రత్త,శిరోవ్యాధులు, జ్ఞాపకశక్తి తగ్గును.

# ఏ గ్రహమువలన ఏఏ రోగములు వచ్చును.

**ఒక్కవిషయం :-** ఈక్రింది వ్రాసిన గ్రహములు దశాంతర్దశలయందు చెడ్డ స్థానములందు ఉన్నప్పుడు షష్ఠాధిపతి అయి ప్రతికూలముగా ఉన్నయెడల గోచార రీత్యా కూడా చెడుస్థానములయందు ఉన్నప్పుడు ఆయా రోగములు రుజువుగా కలుగును. ఆ సమయమున ఆయా గ్రహములకు తగినశాంతులు చేసిన రోగములు నివారణ అగుననుటలో సందేహములేదు.

**1.రవి :-** నేత్రపీడలు, హృదయరోగము, ఎముకలు, ఎడమపార్శ్వపునొప్పి, అతిసారము, మనోవ్యసనం, పైత్యము, సన్నిపాతము, శిరోబాధలు కలిగించును. ఈ రవి అష్టమ స్థానమందున్నప్పుడు ఖచ్చితంగా కలుగును.

**2. చంద్రుడు :-** కంఠం, కడుపుసంబంధవ్యాధులు, కుడిపార్శ్వపునొప్పి, శ్లేష్మం, క్షయ, పాండురోగం, జలసంబంధ రోగములు, ఉబ్బసం, నీరసం, అండరోగం, బోదకాలు కలిగించును. మనఃస్థిమితం లేకుండుట, మనోధైర్యం కోల్పోవుట. ఈ చంద్రుడు 8, 12 స్థానములందు ఉన్నప్పుడు తప్పక కలుగును.

**3. కుజుడు :-** కురుపులు, గిలకలు, అండవృద్ధి, కఫము, ఎడమచెవిపోటు, మూత్రకోశము, శూల, కుష్టుసంబంధ వ్యాధులు, వాహన ప్రమాదములను కలిగించును. సోదర సంబంధ విరోధములు, చర్మవ్యాధులు, ఎముకలు విరుగుట ఈ కుజుడు 8 స్థానము నందు ఉండగా తప్పక జరుగును.

**4. బుధుడు :-** నాలుక, పైత్యం, చర్మవ్యాధులు, గుహ్యారోగం (పైల్స్), ఉదర రోగం, పాండు, కుష్టు, గ్రహణీ, నపుంసకత్వం, సన్నిపాతం కలుగును. ఈ బుధుడు కూడా 8, 12 స్థానములందు ఉన్నప్పుడు తప్పక కలుగును.

**5. గురుడు :-** మెదడు, ఊపిరితిత్తులు, శ్లేష్మం, పైత్యం, బుద్ధివికలం, ప్రేగులలో వ్యాధులు, యిత్యాది కలిగించును. జ్ఞాపకశక్తి తగ్గుట, ఇతర వ్యాపకములు కలిగించుట, జరుగును. ఈ గురుడు అష్టమందు ఉన్నప్పుడుతప్పక కలుగును.

**6. శుక్రుడు :-** నాశికారంధ్రములు, పైత్యరోగం, మేహవ్యాధులు, మూత్రరోగము, సుఖరోగములు, రక్తదోషం, వ్యసనములు, మధుమేహం (షుగర్) యిత్యాది గుప్తరోగములను కలిగించును. ఇంద్రియ రోగములు, భార్యభర్తలమధ్య అన్యోన్యత తగ్గుట, ఈ శుక్రుడు 8, 12 వ స్థానములందు ఉన్నప్పుడు తప్పక జరుగును.

**7. శని :-** కుడిచెవిలోపోటు, కాలేయ సంబంధరోగములు, సంధి, మనోవ్యాధి, వాతరోగములు, గుల్మరోగములు, నరములలో బలహీనతలు, శుక్లనష్టము, యిత్యాది వాటిని కలిగించును. ఈ శని కూడా 8వ యింట ఉన్నప్పుడు జరుగును. గోచార రీత్యా ఏలినాటి శని సమయంలో తప్పక జరుగును.

**8.రాహువు :-** పై శాచికము, శూలరోగము, మతిభ్రమణం, చర్మసంబంధ రోగములు, మూలరోగములు, వాయుదోషము, రక్తములో నీరుచేరుట, ఉబ్బసం కలిగించును. పిశాచ బాధలు, సర్పవ్యాధిభయం కలిగించును.

**9.కేతువు :-** శారీరక బాధలు, నీరసం, నిస్సత్తువ, అనాయా సమరణం, కురుపులు, గజ్జి, బోధకు సంబంధించిన రోగములు యిత్యాది కలుగును. ఈ కేతువు 8వ యింటను, 12 వ యింటను ఉన్నప్పుడు తప్పక కలుగును.

# వధూవర గుణ మేళన చక్రము

## వరుని నక్షత్రము

**18 గుణములకు పైన వచ్చిన వివాహమునకు మంచిది**

| వధువు నక్షత్రము | అశ్వ | భ | కృ 1 | కృ 3 | రో | మృ 2 | మృ 2 | ఆ | పున 3 | పున 1 | పు | ఆ | మఖ | పు | ఉ 1 | ఉ 3 | హ | చి 2 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్విని | 28 | 33 | 28 | 18 | 21 | 22 | 26 | 17 | 18 | 22 | 31 | 27 | 21 | 26 | 17 | 11 | 9 | 11 |
| భరణి | 34 | 28 | 29 | 19 | 28 | 15 | 18 | 26 | 26 | 30 | 23 | 24 | 21 | 19 | 28 | 21 | 19 | 6 |
| కృత్తిక.1 | 27 | 27 | 28 | 17 | 9 | 15 | 19 | 20 | 21 | 25 | 26 | 23 | 17 | 21 | 22 | 15 | 15 | 18 |
| కృత్తిక.3 | 18 | 18 | 19 | 28 | 19 | 25 | 16 | 17 | 18 | 22 | 23 | 20 | 19 | 23 | 24 | 21 | 21 | 23 |
| రోహిణి | 23 | 23 | 10 | 19 | 28 | 36 | 27 | 23 | 23 | 27 | 26 | 13 | 12 | 26 | 28 | 25 | 26 | 20 |
| మృగ.2 | 22 | 13 | 15 | 27 | 34 | 28 | 20 | 25 | 23 | 26 | 19 | 22 | 21 | 17 | 25 | 23 | 27 | 13 |
| మృగ.2 | 27 | 18 | 21 | 18 | 25 | 20 | 28 | 33 | 31 | 19 | 10 | 15 | 24 | 20 | 28 | 30 | 34 | 21 |
| ఆరుద్ర | 19 | 27 | 21 | 18 | 24 | 26 | 34 | 28 | 25 | 13 | 20 | 13 | 23 | 29 | 22 | 24 | 24 | 27 |
| పున.3 | 19 | 26 | 22 | 19 | 23 | 24 | 32 | 24 | 28 | 16 | 23 | 16 | 22 | 27 | 21 | 23 | 24 | 25 |
| పున.1 | 21 | 28 | 23 | 20 | 24 | 25 | 19 | 10 | 14 | 28 | 35 | 28 | 15 | 20 | 14 | 18 | 18 | 20 |
| పుష్య | 30 | 21 | 26 | 23 | 24 | 17 | 10 | 18 | 21 | 35 | 28 | 30 | 18 | 14 | 23 | 26 | 27 | 12 |
| ఆశ్లేష | 25 | 23 | 22 | 19 | 12 | 21 | 13 | 12 | 15 | 28 | 28 | 28 | 15 | 15 | 17 | 20 | 20 | 26 |
| మఖ | 21 | 21 | 17 | 18 | 11 | 19 | 22 | 22 | 21 | 16 | 18 | 16 | 28 | 30 | 16 | 16 | 16 | 22 |
| పుబ్బ | 27 | 19 | 21 | 22 | 25 | 17 | 20 | 28 | 27 | 22 | 16 | 16 | 30 | 28 | 34 | 24 | 22 | 8 |
| ఉత్తర.1 | 18 | 27 | 22 | 23 | 27 | 25 | 28 | 21 | 21 | 16 | 25 | 18 | 26 | 34 | 28 | 18 | 16 | 14 |
| ఉత్తర.3 | 13 | 21 | 16 | 21 | 25 | 23 | 30 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 25 | 19 | 28 | 25 | 24 |
| హస్త | 11 | 20 | 16 | 21 | 26 | 26 | 33 | 23 | 33 | 19 | 28 | 21 | 17 | 22 | 17 | 26 | 28 | 27 |
| చిత్త.2 | 13 | 6 | 19 | 25 | 20 | 12 | 19 | 26 | 24 | 20 | 12 | 26 | 23 | 9 | 15 | 24 | 27 | 28 |
| చిత్త.2 | 22 | 15 | 28 | 23 | 20 | 12 | 13 | 20 | 18 | 20 | 12 | 26 | 25 | 10 | 17 | 17 | 20 | 21 |
| స్వాతి | 27 | 29 | 17 | 12 | 16 | 27 | 27 | 26 | 26 | 28 | 28 | 15 | 13 | 25 | 25 | 25 | 27 | 21 |
| విశాఖ.3 | 22 | 22 | 20 | 15 | 10 | 18 | 19 | 21 | 21 | 22 | 21 | 19 | 17 | 19 | 18 | 17 | 18 | 21 |
| విశాఖ.1 | 16 | 16 | 14 | 19 | 14 | 22 | 13 | 14 | 14 | 19 | 18 | 15 | 21 | 23 | 21 | 18 | 19 | 28 |
| అనూరాధ | 24 | 14 | 19 | 24 | 27 | 20 | 11 | 16 | 21 | 26 | 18 | 21 | 24 | 20 | 29 | 26 | 27 | 12 |
| జ్యేష్ఠ | 12 | 18 | 24 | 29 | 22 | 22 | 13 | 3 | 6 | 10 | 20 | 26 | 31 | 23 | 16 | 13 | 12 | 25 |
| మూల | 12 | 20 | 24 | 19 | 13 | 14 | 21 | 15 | 12 | 8 | 17 | 24 | 25 | 19 | 9 | 13 | 13 | 27 |
| పూ॥షా | 27 | 20 | 19 | 13 | 20 | 12 | 18 | 26 | 26 | 23 | 13 | 17 | 21 | 19 | 27 | 27 | 26 | 11 |
| ఉ॥షా.1 | 25 | 27 | 14 | 08 | 11 | 18 | 24 | 26 | 26 | 23 | 24 | 9 | 11 | 27 | 28 | 28 | 27 | 20 |
| ఉ॥షా.3 | 28 | 29 | 16 | 14 | 17 | 22 | 20 | 22 | 22 | 27 | 28 | 13 | 6 | 22 | 23 | 26 | 25 | 17 |
| శ్రవణం | 27 | 26 | 13 | 10 | 17 | 26 | 23 | 21 | 23 | 28 | 26 | 15 | 17 | 18 | 20 | 23 | 25 | 18 |
| ధనిష్ఠ.2 | 20 | 10 | 26 | 23 | 20 | 12 | 8 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 5 | 12 | 16 | 18 | 16 |
| ధనిష్ఠ.2 | 20 | 11 | 26 | 30 | 27 | 19 | 10 | 19 | 19 | 14 | 5 | 20 | 25 | 11 | 19 | 17 | 21 | 18 |
| శతభిషం | 15 | 21 | 28 | 32 | 25 | 25 | 18 | 10 | 10 | 7 | 15 | 20 | 26 | 20 | 13 | 11 | 8 | 26 |
| పూ॥భా.3 | 18 | 25 | 20 | 24 | 31 | 31 | 24 | 17 | 17 | 13 | 20 | 14 | 19 | 25 | 17 | 15 | 17 | 18 |
| పూ॥భా.1 | 14 | 21 | 16 | 19 | 26 | 26 | 25 | 18 | 18 | 18 | 25 | 18 | 16 | 22 | 14 | 16 | 18 | 19 |
| ఉ॥భాద్ర | 24 | 15 | 18 | 21 | 25 | 17 | 16 | 25 | 27 | 26 | 19 | 20 | 17 | 15 | 25 | 27 | 26 | 9 |
| రేవతి | 25 | 24 | 11 | 14 | 17 | 26 | 25 | 24 | 25 | 24 | 27 | 13 | 12 | 22 | 22 | 24 | 26 | 20 |

# వధూవర గుణ మేళన చక్రము

## వరుని నక్షత్రము

18 గుణములకు పైన వచ్చిన వివాహమునకు మంచిది

| చి 2 | స్వా | వి 3 | వి 1 | అనూ | జ్యే | మూ | పూషా | ఉషా 1 | ఉషా 3 | శ్ర | ధ 2 | ధ 2 | శ | పూభా 3 | పూభా 1 | ఉభా | రే |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 22 | 26 | 22 | 19 | 26 | 15 | 13 | 27 | 24 | 26 | 24 | 21 | 21 | 15 | 16 | 14 | 24 | 26 |
| 14 | 29 | 22 | 19 | 17 | 19 | 20 | 20 | 27 | 28 | 26 | 10 | 10 | 20 | 24 | 22 | 16 | 28 |
| 27 | 15 | 19 | 16 | 20 | 26 | 24 | 19 | 14 | 15 | 10 | 25 | 25 | 27 | 19 | 17 | 19 | 11 |
| 22 | 10 | 14 | 21 | 25 | 31 | 20 | 13 | 9 | 14 | 10 | 23 | 29 | 31 | 23 | 20 | 22 | 14 |
| 19 | 15 | 9 | 16 | 30 | 24 | 14 | 20 | 11 | 17 | 18 | 20 | 26 | 24 | 30 | 27 | 26 | 19 |
| 10 | 25 | 17 | 23 | 22 | 25 | 15 | 11 | 18 | 21 | 24 | 13 | 19 | 27 | 29 | 26 | 17 | 27 |
| 14 | 27 | 19 | 14 | 11 | 13 | 23 | 18 | 24 | 20 | 25 | 12 | 13 | 21 | 23 | 27 | 17 | 27 |
| 20 | 27 | 20 | 13 | 17 | 4 | 16 | 27 | 27 | 22 | 22 | 17 | 18 | 11 | 16 | 19 | 27 | 27 |
| 18 | 27 | 21 | 13 | 20 | 5 | 13 | 26 | 27 | 27 | 23 | 17 | 18 | 11 | 17 | 19 | 27 | 28 |
| 20 | 27 | 20 | 19 | 26 | 10 | 8 | 20 | 21 | 28 | 27 | 21 | 12 | 7 | 11 | 17 | 25 | 25 |
| 11 | 26 | 27 | 20 | 19 | 22 | 17 | 11 | 22 | 26 | 25 | 13 | 4 | 14 | 18 | 24 | 18 | 27 |
| 25 | 11 | 16 | 15 | 20 | 26 | 22 | 16 | 8 | 12 | 13 | 27 | 18 | 18 | 12 | 18 | 20 | 12 |
| 25 | 11 | 17 | 24 | 26 | 34 | 24 | 21 | 11 | 5 | 4 | 18 | 24 | 25 | 18 | 17 | 18 | 12 |
| 11 | 25 | 19 | 26 | 24 | 24 | 19 | 19 | 27 | 21 | 18 | 4 | 11 | 19 | 24 | 23 | 16 | 24 |
| 17 | 26 | 17 | 24 | 32 | 19 | 10 | 27 | 28 | 22 | 20 | 11 | 18 | 12 | 16 | 15 | 26 | 24 |
| 16 | 25 | 16 | 18 | 27 | 13 | 15 | 28 | 29 | 26 | 25 | 16 | 16 | 10 | 14 | 18 | 29 | 27 |
| 19 | 26 | 17 | 19 | 26 | 12 | 14 | 26 | 27 | 23 | 24 | 19 | 19 | 7 | 14 | 19 | 27 | 27 |
| 20 | 19 | 26 | 28 | 11 | 25 | 28 | 13 | 21 | 17 | 19 | 18 | 18 | 24 | 18 | 22 | 11 | 21 |
| 28 | 27 | 34 | 24 | 7 | 21 | 28 | 13 | 21 | 25 | 27 | 26 | 20 | 26 | 20 | 15 | 4 | 13 |
| 28 | 28 | 20 | 10 | 23 | 18 | 23 | 26 | 18 | 22 | 23 | 27 | 21 | 20 | 25 | 19 | 20 | 13 |
| 34 | 18 | 28 | 18 | 17 | 21 | 28 | 21 | 13 | 17 | 17 | 32 | 26 | 26 | 22 | 16 | 13 | 5 |
| 23 | 8 | 17 | 28 | 27 | 31 | 23 | 17 | 9 | 12 | 12 | 27 | 27 | 26 | 22 | 21 | 18 | 9 |
| 7 | 22 | 17 | 28 | 28 | 31 | 16 | 14 | 22 | 25 | 26 | 12 | 12 | 22 | 24 | 24 | 18 | 27 |
| 20 | 17 | 20 | 31 | 30 | 28 | 15 | 17 | 17 | 20 | 20 | 25 | 25 | 18 | 11 | 9 | 21 | 21 |
| 27 | 21 | 27 | 24 | 26 | 16 | 28 | 27 | 25 | 15 | 15 | 21 | 25 | 21 | 11 | 17 | 25 | 27 |
| 11 | 26 | 19 | 18 | 18 | 19 | 27 | 28 | 34 | 24 | 23 | 8 | 15 | 22 | 29 | 32 | 23 | 32 |
| 20 | 19 | 12 | 11 | 25 | 19 | 25 | 34 | 28 | 18 | 15 | 15 | 22 | 22 | 28 | 31 | 32 | 23 |
| 24 | 23 | 16 | 14 | 28 | 22 | 16 | 25 | 19 | 28 | 25 | 25 | 17 | 17 | 23 | 30 | 32 | 23 |
| 25 | 23 | 16 | 14 | 28 | 23 | 17 | 25 | 15 | 24 | 28 | 30 | 20 | 18 | 23 | 32 | 31 | 24 |
| 24 | 26 | 30 | 28 | 14 | 28 | 21 | 9 | 16 | 25 | 21 | 28 | 18 | 23 | 21 | 26 | 15 | 22 |
| 19 | 22 | 25 | 28 | 12 | 26 | 29 | 16 | 13 | 18 | 21 | 20 | 28 | 33 | 28 | 18 | 7 | 14 |
| 26 | 19 | 26 | 26 | 21 | 19 | 22 | 23 | 23 | 18 | 18 | 25 | 33 | 28 | 19 | 9 | 17 | 16 |
| 19 | 28 | 21 | 21 | 27 | 12 | 15 | 30 | 29 | 24 | 25 | 20 | 27 | 19 | 28 | 18 | 23 | 20 |
| 12 | 20 | 14 | 21 | 27 | 11 | 15 | 31 | 30 | 28 | 30 | 25 | 17 | 7 | 16 | 28 | 33 | 30 |
| 3 | 19 | 12 | 19 | 20 | 22 | 24 | 22 | 31 | 29 | 29 | 14 | 6 | 16 | 21 | 33 | 28 | 34 |
| 13 | 11 | 5 | 12 | 27 | 22 | 27 | 30 | 21 | 19 | 22 | 22 | 14 | 16 | 18 | 29 | 33 | 28 |

# ఉపయోగ విషయములు

**స్థలం కొనుటకు :- (బేరసారాలు)** 2,3,5,10,11తిధులు,అశ్వని, భరణి,మృగశిర, పునర్వసు, ఉత్తర,హస్త,చిత్త, స్వాతి, అనూరాధ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, శ్రవణం, శతభిషం, రేవతి, నక్షత్రాలలో బేరసారాలు జరుపుటకు మంచిది

**స్థలం రిజిస్ట్రేషన్ :-** శుభతిధులు, శుభనక్షత్రాలలోస్థలం రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. వర్జ్యం, దుర్మూహూర్త కాలంలో చేయించరాదు.

**కొన్నస్థలంలోబోరింగ్‌లేదానుయ్యివేయుటకు :-** 2,3,5,7,11,15తిధులు, సోమ,మంగళ, గురు,శుక్రవారాలు, కర్కాటక, వృశ్చిక, మీనలగ్నాలు, మంచివి. నుయ్యి లేదా బోరింగ్ ఈశాన్యంలోనే తీయాలి.

**శంఖు స్థాపనకు :-** 3,5,7,11,13,15 తిధులు బుధ, గురు, శుక్రవారాలు, మృగ, హస్త, రేవ,రోహి,అనూ,ఉత్త,పుష్య,శ్రవ, పున, ధని,శత, స్వాతి నక్షత్రములందు వృష,కర్కా,ధను,కుంభలగ్నములందునూ,చతుర్థ,అష్టమ,శుద్ధిచూడవలెను.

**గుమ్మంముహూర్తం (గుమ్మంపెట్టుటకు) :-** 3, 5, 7, 11, 12, 15 తిధులు, సోమ,బుధ,గురు, శుక్రవారాలయందుమంచి ముహూర్తసమయమున గుమ్మం స్థాపించాలి. గుమ్మంఇంటి గర్భంలో అనగా మధ్యభాగంన ఈశాన్యం వైపు ముందుగా స్థాపించాలి.

**స్లాబు వేయుటకు :-** 2,3,5,7,10,11,12,14,15 తిధులందు,వర్జ్యం,దుర్మూహూర్తం లేకుండా స్లాబువేయుట ప్రారంభించాలి.

**గృహప్రవేశము :-** 2,3,5,7,13,15తిధులుబుధ,గురుశుక్రవారాలు, మృగ,రేవ,రోహి,అనూ,ఉత్త,పుష్య,శ్రవ,పున,ధని,శత, స్వాతినక్షత్రములు,వృష, సింహ, వృశ్చి, కుంభ లగ్నాలు, లగ్నశుద్ధి,అష్టమశుద్ధి,ద్వాదశిశుద్ధిచూడవలెను.

**ఉపనయనము :-** 2,3,5,7,10,11,13,సోమ, బుధ, గురు, శుక్రవారములు, అశ్వి,అనూ,రేవ,మృగ,స్వాతి,రోహి,ఉత్త,ఉషాఢ,ఉ.భా,శతనక్షత్రములు, వృష, మకర,కుంభ, కన్య, కర్కా, తుల, ధను, మీన లగ్నాలు, అష్టమశుద్ధి చూడాలి.

**పెండ్లిచూపులు :-** 2,3,5,7,10,11 తిధులు, మంచిలగ్నం, శుభనక్షత్రాలలో చూడాలి. ప్రయాణముహూర్తంకూడానిర్ణయించుకొని బయలుదేరివెళ్ళిన మీరనుకున్న మాటలుకలసిఆసంబంధంకుదురును.

**నిశ్చయతాంబులాలు :-(నిశ్చితార్థం)**2,3,5,7,10,11,12ఉభయపక్షతిధులు శుక్లపక్షంలో 13,15 తిధులు, ఆది, బుధ, గురు, శుక్ర, శనివారాలు అశ్వని, మృగశిర,పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, అనురాధ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, రేవతినక్షత్రాలు,మంచిలగ్నానికి కేంద్రకోణములందు పాపగ్రహాలు లేకుండా నిశ్చయితాంబులాలు తీసుకోవాలి.

**పెండ్లికుమారుడను, పెండ్లికుమార్తెనుచేయుటకు:-** పెండ్లి కుమారుడను, పెండ్లి కుమార్తెనుచేయుటకు 2,3,5,7,10,11తిధులు,ఆది,బుధ,గురు, శనివారాలు,అశ్వని,పునర్వసు,పుష్యమి,చిత్త,స్వాతి,శ్రవణం,ధనిష్టనక్షత్రాలలో చేయాలి. కేంద్రకోణశుద్ధిచూడాలి.ముత్తైదువులనుపేరంటానికిపిలిచిశనగలుతాంబులంఇవ్వాలి.

**పందిరిరాట వేయుటకు** :- పెండ్లికి ఇంటిముందుపందిరివేసిపచ్చనితోరణాలు కట్టడంహిందూసాంప్రదాయం. పెండ్లికుమారుని లేదా పెండ్లికుమార్తెనుచేసే సమయంలో పెండ్లిపందిరిరాట పాతవలెను. పందిరిరాటకు పైభాగానపసుపు రాసి, కుంకుమబొట్టుపెట్టి, మామిడి తోరణంకట్టి పాతిపెట్టాలి. కొబ్బరికాయకొట్టాలి.

**వివాహము** :- 2, 3, 5, 7, 10, 13, 15 తిథులు, బుధ, గురు, శుక్రవారాలు మూల,అనూ,మృగ,రోహి,హస్త,రేవ,ఉత్త,స్వాతి,మఖ,ఉ.షాఢ,ఉత్తరాభాద్రనక్షత్రములు వృష,మీన,కన్యతుల,ధను,మేషలగ్నములు సప్తమ శుద్ధిచూడవలెను.

**సత్యనారాయణస్వామివారివ్రతం** :-ఈ సత్యనారాయణస్వామివారివ్రతం నూతనంగాపెండ్లి అయినదంపతులచే జరిపించాలి. పెండ్లి అయినమరుసటి రోజునగాని, లేదా పెండ్లిఅయినమరసటిరోజున గర్భాధానం(శోభనం)జరిపితే మూడురాత్రులుఅనంతరం నాల్గువ రోజున లేదా 5 వరోజునగాని ఈ వ్రతం చేయాలి. సత్యనారాయణవ్రతంచేసిన రోజున గర్భాదానంచేయరాదు.

**వధూప్రవేశం** :- 2,3,5,7,10తిథులు,సోమ,బుధ,గురు, శుక్రవారాలు, మృగ,ధని,ఉ.భాద్ర,పున,పుష్య,రోహి,అనూ,అశ్వ,హస్త,నక్షత్రాలు,వృశ్చి, కుంభ, కన్య,కర్కా,తుల,ధను,మీనలగ్నములు, ద్వాదశిశుద్ధిచూడవలెను,పగలుశుభము.

**గర్భాదానం:-(శోభనం)** 2,3,5,7,10,12తిధులు,సోమ,బుధ,గురు, శుక్రవారాలు, రోహిణి,మృగశిర,పునర్వసు,పుష్యమి,ఉత్తర,హస్త,చిత్త,స్వాతి,అనూరాధ, ఉత్తరాషాఢ, శ్రవణం,ధనిష్ట,శతభిషం,ఉత్తరాభాద్ర,నక్షత్రాలు,వృషభ,కర్కాటక, కన్య,తుల, ధనుస్సు, మీనలగ్నాలు, లగ్నశుద్ధి, అష్టమశుద్ధి తప్పనిసరి.

**నెలలోపెండ్లి కుమార్తెను అత్తవారింటికి పంపుటకు** :- 2, 3, 5, 7, 10 తిధులు,బుధ,గురు,శుక్రవారాలు, అశ్వని, రోహిణి,మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ హస్త, చిత్త, స్వాతి, అనురాధ, జ్యేష్ట, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం,ధనిష్ట, రేవతి,నక్షత్రాలయందును,వృషభ, మిధున, కర్కాటక, సింహ,వృశ్చిక , ధనుస్సు కుంభ, మీన లగ్నాలు మంచివి.

**16 రోజుల వివాహ పండుగ** :- **(SIXTEN DAYS MARRIAGE FUNCTION)** 16రోజుల వివాహపండుగ అనేది సరగా పండుగ కొత్త అల్లుడిని అత్తవారు నెలలో తీసుకొనివెళ్ళి16రోజులు వరకు వారి ఇంటి వద్ద ఉంచుకొని అల్లుడుకు సమస్తమర్యాదలుచేస్తారు. 16వరోజున బంగారపువస్తువులు నూతనవస్త్రములు పెట్టిఅల్లుడికిఅతిధిమర్యాదలతోఆతిధ్యంఇస్తారు. ఇదిహిందూసాంప్రదాయంలో ఒకసరదాపండుగ. ఇదిఅన్నివర్గాలవారుఅన్నికులాలవారుజరుపించుకో వచ్చును. ఈపండుగపెండ్లిఅయినవారికి మొదటగా కొత్తలోజరిపేపండుగ. వివాహం అయిన 16 రోజులు దాటితే ఈ పండుగ చేయనక్కర్లేదు. మీ ఆచారాలప్రకారం చేయండి

**రెండవవివాహం** :- భార్యచనిపోయినవారుమరలవివాహంచేసుకొనదలిచినయెడల భార్యయొక్కసంతానంజీవించిఉన్నప్పుడుబేసినెల, బేసిసంవత్సరం సంతానం లేనియెడల సరి నెల, సరిసంవత్సరములో వివాహం చేసుకొనవలెను.

**పురుటికి తీసుకొనువచ్చుటకు** :- 2,3,5,7,10,13 తిధులు,సోమ,బుధ,గురు శనివారాలు, శుభనక్షత్రాలలో గర్భిణీస్త్రీకి తారాబలం సరిపోయే విధంగా చూచి వార శూలలుచూచుకొని పురుటికి తీసుకొనిరావాలి. ఈవిధంగా చేయుటవలన ప్రసవంసుఖముగా జరుగును. ఇప్పటికాలంలో ఎదురుచుక్కదోషము లేదు.

